

# కదంబ కంద మాలిక



సూర్యశ్రీ
(డా॥ సుబ్బలక్ష్మి మర్ల)



# KADAMBA KANDA MALIKA
(Kanda Satakam)

**Surya Sree**


ప్రతులు : 1000

ప్రథమ ముద్రణ : 2003

ముఖచిత్రాలంకృతి : 'బ్నిం'

బొమ్మలు : ఎమ్. శ్రీధర్

వెల : రూ. 45/-
US $ : 4

ప్రతులు :

**Dr. SUBBA LAKSHMI MARLA**
Flat No. 107 INDIGO
My Home Rainbow Apts.
Sheikpet Nala, Tolichowki
Hyderabad - 500 008.
Ph. : 23566576

Composed by : **Venkateswara Graphics**

Printed at :
**Vipla Computer Services**
*(Designers & Multi Colour Offset Printers)*
Nallakunta, Hyderabad.
Ph : 27676910

Jnanpith Awardee
**Dr. C. Narayana Reddy** M.P
M.A., Ph.d., D litt.

CHAIRMAN
**Andhra Pradesh State Cultural Council**
**Government of Andhra Pradesh**
Kalabhavan, Hyderabad - 500 004.
Ph : (O) 23214603 (R) 23548451
Fax : (O) 23214603




జ్ఞానపీఠ అవార్డు గ్రహీత
**డాక్టర్ సి. నారాయణ రెడ్డి,** ఎం.పి
ఎం.ఏ.,పిహెచ్.డి.,డి.లిట్.,

అధ్యక్షులు
**ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర సాంస్కృతిక మండలి**
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం
కళాభవన్, హైదరాబాదు - 500 004
ఫోన్ (ఆ) 23214603 (ఇ) 23548451
ఫాక్స్ (ఆ) 23214603

22.1.2003

# ఆశీస్సులు

'కందం రాసినవాడే కవి' అనేది అనూచానంగా వస్తున్న ఉక్తి. ఇప్పటికీ ప్రతి పద్యకవి కంద రచన చేస్తూనే ఉన్నాడు.

డా. సుబ్బలక్ష్మి వివిధ విషయాలపైన రచించిన కంద పద్యాల సంపుటి ఇది. ఈ పద్యాలలో ఎన్నెన్నో హితోక్తులు చోటు చేసుకున్నాయి. అంతేకాదు. కాల ప్రభావంతో ఎలా నీతులు తారుమారవుతున్నాయో డా.సుబ్బలక్ష్మి పద్యాలలో వివరించిన తీరు ప్రశంసనీయంగా ఉంది. తాను గ్రహించిన ఏ అంశాన్నైనా పొదుపుగా, పొందికగా కుదిరిన మాటల్లో అందించిన డా. సుబ్బలక్ష్మి మర్లకు నా ఆశీస్సులు.

(డా.సి. నారాయణ రెడ్డి)

**Prof. E. Siva Reddy**
M A Ph.D. (Telugu) M A. (Sanskrit)



Phone Res : 27632020
Off : 27682294

DEPARTMENT OF TELUGU
University College of Arts & Social Sciences
Osmania University, Hyderabad - 500 007
Secretary, Andhra Saraswatha Parishat

RASA BHARATI
1-1-336/77 (518), Viveknagar
Chikkadpally, Hyderabad - 20

# కందాల కంఠమాల

**ఆచార్య ఎల్లూరి శివారెడ్డి**

ఆధునిక కాలంలో పద్యరచన బహువిరళం. పద్యరచన చేసిన వారిలోనైనా గణబద్ధత చూసుకున్న వారేకాని గుణనిబద్ధత పాటించిన వారు తక్కువ. పద్యరచనలో మెలకువ చూపదగినవి ధార, శయ్య, భావపుష్టి, కవితావేశం. ఈ గుణాలన్ని అమరి ఉన్నప్పుడు పద్యం పరుగులు తీస్తుంది శ్రీనాథుని రచనలా, జాషువా కవితాధారలా.

డా॥ మర్ల సుబ్బలక్ష్మి గారు చక్కని భావసంపదతో ఈ శతకాన్ని రచించారు.

వస్తువులో వైవిధ్యం ఉంది. నడకలోనాజూకుతనముంది. భాషలో సార్వజనీనతఉంది. నిర్దుష్టమైన శబ్దం, పరిపుష్టమైన పలుకుబడి ఈ రచన అంతటా దర్శన మిస్తాయి. ఆమె తన అభిరుచిని గౌరవించి, తనను మన్నించే భర్తకు ఈ రచనను అంకితమిచ్చారు. వారి అన్యోన్యత శబ్దార్థాల వంటిది. భర్త ఆర్థిక శాస్త్రవేత్త కావడం వల్ల తద్గుణసాంగత్యం వల్ల ఆమె 'Economy of words' పట్ల జాగ్రత్త పడ్డారు. పరిశోధకురాలిగా పండబారిన అనుభవం కలిగిన ఈ విదుషీమణి కవితా పరిమళాల పద్యపారిజాతాలను మనకు అందించారు. అదీ జనమంతా యాంత్రిక జీవులుగా మనుగడ సాగిస్తున్న ప్రస్తుత కాలంలో.

ఆమె కందాన్ని చాలా అందంగా నడిపించారు. అవసరమైన చోట అనుప్రాసల తళుకులు జోడించారు. అయినా వినయపూర్వకంగా 'తొలినేజేసిన పుణ్యము కలికీ ఈ రీతి నాదు కవితైవిరిసెన్' అనడం కేవలం సంస్కార బలం. ఒక్కో పద్యంలో ఒక్కోవిషయాన్ని శిల్పించారు. అల్లసాని పెద్దనను కందాల పల్లకిలో ఊరేగించారు. 'రసరాజము శృంగారము' అని భట్టుమూర్తి ప్రతిభకు పద్యాభిషేకం చేశారు. సరిహద్దు పొంచిన శత్రువును వెంటాడే వీరసైనికుల గళంలో పద్యమాల సవరించారు. ప్రాచీన నీతులను సవరిస్తూ

'అల్లుని మంచితనం బది
కల్లయటంచు పలికెనొకకవివరు డెలమిన్
కల్లయె కాదది యీనా
డల్లురు అత్తింటి వారికాప్తులుకారే' అని వివరించారు.

కట్నాల బెడద ఉన్నంతవరకు అల్లుని మంచితనం అనుమానాస్పదమే మరి ! ఆమె సవరించిన మరో నీతి 'కోడలె యత్తను మొత్తును చూడగ నీజగతిలోన' అనేది. ఇది కాస్త చమత్కృతితో చురుమనిపించే భావన.

డా॥ సుబ్బలక్ష్మి గారు మానవ ప్రకృతిని పరిశీలించారు.అనుభవాలను ఆర్జించారు. క్రమశిక్షణను బోధించారు. కమ్మని భావమధురిమను పంచారు. ప్రపంచీకరణలో వ్యాపార ధోరణి ప్రబలిన ఈ కాలంలో

'కొడుకునకు పెండ్లిసేయగ,
కొడుకును గోడలును మిగుల కూరిమితోడన్,
కడుస్నేహము గూర్చి తమను దడయక
సేవింతురనుచు తలతురుపితరుల్

అని భావించడం ఆమె ఆశావహ దృక్పథానికి సాక్ష్యం. ఎందరి అనుభవాలో గమనించి వారి అందరి పక్షాన సుకుమారంగా పలికిన ఈ పలుకుల్లో రవ్వంత వేడి ఉంది.

ఇంత చక్కని పద్యరచనను అందించిన డా. సుబ్బలక్ష్మి గారికి హార్దికాభినందనలు.

(ఎలూరి శివారెడ్డి)

# స్వాభిప్రాయము

ఈ కవయిత్రి డా॥ సుబ్బలక్ష్మి మర్ల నా అర్ధాంగి. గత 44 సంవత్సరాలుగా నా సహధర్మచారిణి. ఈమెకు తెలుగు సాహిత్యం, వ్యాకరణం, గణిత శాస్త్రములలో అభిరుచి ఎక్కువ. ఆటపాటలలో ఆసక్తి మెండు. చిన్న వయసులోనే వివాహమయినందు వల్ల ఉన్నత విద్య నభ్యసించుటకు అవరోధము కల్గింది. ఇద్దరు పిల్లలు కల్గిన తదుపరి నా ఉద్యోగరీత్యా స్వగ్రామం వదిలి ఢిల్లీలో ప్రవాసాంధ్రులుగా ఎక్కువకాలం స్థిరపడుటవలన ఉన్నత విద్య నభ్యసించాలనే ఆసక్తి ఉన్నా గృహకార్య తత్పరతచే వీలుపడలేదు. అయినా వెనుకంజ వేయకుండా కుతూహలంతో ప్రయివేటుగా P.U.C. ఉన్నత శ్రేణిలో పూర్తిచేసింది. కాలం కలసి వచ్చి నాకు హైదరాబాద్ బదలీ అవడంతో అదే సదవకాశంగా తీసుకొని అత్యంత తక్కువ వ్యవధిలోనే ప్రయివేటుగా B.A; M.A. పట్టాలు ఉన్నత శ్రేణిలో పొందుటకు వీలుపడింది. 1990 లో మరల విద్యార్థినిగా చేరి ఉస్మానియా విశ్వవిద్యాలయ మందు తెలుగు సాహిత్యంలో M. Phil చేసి తదుపరి 1994లో Ph.D పట్టాన్ని చేపట్టింది.

ఈమె వివిధ అంశముల పై వ్రాసిన అనేక పద్య గద్య రచనలు ప్రసిద్ధిగాంచిన భారతి, చందమామ, వనిత, ఆంధ్రపత్రిక, ఆంధ్రప్రభ, ఆంధ్రభూమి, ఈనాడు వంటి పత్రికలలో సూర్యశ్రీ అనే పేరుతో కవితలు, డా॥ సుబ్బలక్ష్మి మర్ల అనే పేరుతో వ్యాసాలు ప్రచురింపబడ్డాయి.

డా॥ సుబ్బలక్ష్మి Ph.D పట్టాన్ని పొందడానికై తీసుకొన్న Subject "తెలుగు జానపద సాహిత్యం పౌరాణిక గేయగాథలు". ఈ ప్రామాణిక సిద్ధాంత వ్యాసం 1996లో 713 పుటలతో ముద్రింపబడినది. ఈ సందర్భములో ఈమె చేసిన కృషి జానపద సాహిత్య రంగములో అందరి మన్ననలను అందుకొని ప్రశంసలను పొందింది. కారణమేమన అది ఒక సాహితీ క్రతువు లాంటిది. ఇప్పటి వరకూ మౌఖికంగా వంశపారంపర్యాయంగా వ్యవహరింపబడుతున్న పౌరాణిక గేయగాథలని తదుపరి తరాలవారు నేర్చుకొని వల్లించాలనే

శ్రద్ధచూపక పోవుటచే కాలక్రమేణా అంతర్ధానమవుతున్న ఈ సువర్ణ ఖనిజ సంపదని ఏవిధంగా నైనా రక్షించాలనే తపనతో ఈమె ఈ సాహితీ క్రతువనే కృతిని గ్రంథ రూపములో ప్రచురణలోకి తీసుకొని వచ్చింది.

ఈమె యొక్క రచనా వైవిధ్యంలో వైశిష్ట్యం గోచరిస్తుంది. ఈమె శైలి పండిత జనామోదితముగాను సామాన్య పాఠకులకు అందు బాటులో ఉంటూ సహజ మైన వ్యావహారిక భాషలో రచయిత్రిగా ప్రజ్ఞాశాలి అయినది. ఈమె రచనలన్నీ ఏ దృష్టి కోణములోంచి చూసినా Factual Base తో Research oriented గా వుంటాయి.

"పిట్ట కొంచెం, కూత ఘనం" అనే లోకోక్తి ఈమెకు వర్తిస్తుంది. ఒక వైపు ఇంటిలోని వంటా వార్పూ ఇంటి వ్యవహారాలతో పాటు వచ్చేపోయే వారి యొక్క ఆదరణలన్నిటిని స్వయంగా చూచుకొంటూ, పిల్లల అభివృద్ధికి తానే శ్రద్ధ వహించిన కారకురాలై "లావొక్కింతయూ" లేకున్ననూ "అవస్తే పూజితోరామ" అనునట్లుగా అనారోగ్య కారణంగా ఎన్నో అవస్థలు పడుతూ సముద్రములోని నావలా క్రిందికీ పైకీ తేలుతున్నప్పటికీ వెనుకంజ వేయకుండా, ఎన్నో వ్యయప్రయాసల కోర్చి, తన ఊపిరిని తాను పీల్చుకోలేని స్థితిలో ఉండి కూడా పట్టుపట్టిన విక్రమార్కునిలా పట్టుదలను వీడకుండా. కర్తవ్యనిబద్ధురాలై "కృషితో నాస్తి దుర్భిక్షం" అన్నదే దృష్టియందుంచుకొని సాహితీ వ్యాసంగాన్ని సాగిస్తూ వచ్చింది.

నా ఉద్యోగ రీత్యా, మేము పాట్నా, బీహారు రాష్ట్రములో నున్న 5 సం॥లలో ఈమె "పాటలీపుత్ర తెలుగు వాహిని" అన్న పేరుతో అచ్చటనున్న 100 తెలుగు కుటుంబాల వారికి మన సంస్కృతిని అద్దములో తిలకించేటట్లుగా తను స్వంతంగా ఒక మాస పత్రికను ఆంధ్ర సాంస్కృతిక సంఘం ద్వారా నిర్వహించేరు. నాటికలు రచించి స్వయముగా దర్శకత్వం వహించి పాట్నాలోను, ఢిల్లీలోనూ ప్రదర్శింపజేసేరు.

1998, డిసెంబరు, న్యూఢిల్లీలో నిర్వహింపబడ్డ ప్రపంచ తెలుగు మహాసభలలో సంస్కృతి విభాగంలో ఈమె ఒక వక్తగా "ఆంధ్రుల చారిత్రక వైశిష్ట్యం" అనే వ్యాసమును రచించి ప్రసంగించి PAPER ప్రెజెంటేషన్ చేయుట జరిగినది. డా॥ సుబ్బలక్ష్మి గారి వ్యాసం, ఆమె శ్రద్ధకూ, నిశిత పరిశీలనకూ, నిరంతర కృషికీ, ఆసక్తికీ నిదర్శనమని, ఆమె పొందుపరచిన సాంస్కృతిక విశేషాలు అమూల్యమైనవని, విజ్ఞులు కొనియాడారు.

కాలక్రమేణా తెలుగు సాహిత్య రంగంలో ఛందోబద్ధమైన పద్యరచన ప్రాముఖ్యత తగ్గుముఖం పట్టిన తరుణంలో డా॥ సుబ్బలక్ష్మి మర్ల, మరల దీనిని పెంపొందించే సదుద్దేశంతో చక్కని, చిక్కని కవిత్వముతో 125 కందపద్యముల శతకమున, దేవతామూర్తులను చిత్తశుద్ధితో, దైవ భక్తితో స్తుతించుచూ, "దేశభాషల యందు తెలుగు లెస్స" అన్న శ్రీ కృష్ణదేవరాయలు కొలువులో అష్టదిగ్గజములను మనకు జ్ఞప్తికి తెచ్చి మరియు ప్రస్తుతకాలములో in and around లో current affairs కు సంబంధించిన దైనందిన జీవన సత్యాలను ఇతి వృత్తాంశంబులుగ తీసుకొని శతక రూపముగా తీర్చి దిద్దిన ఫలితమే ఈ

**"కదంబ కంద మాలిక".**

నా అర్ధాంగి డా॥ సుబ్బలక్ష్మి మర్ల

`కదంబ కందమాలిక' అను 125 కంద పద్యముల రచన గావించి ఈ సభాముఖముగా నాకు 'కంఠహారముగ' అంకితము చేయగా పులకిత హృదయముతో దీనిని నేను స్వీకరిస్తూ

'May God Shower HIS Blessings on HER'

అని భగవంతుని ప్రార్థిస్తూ

ఆశీఃపూర్వకముగా

ఆమెను అభినందించుచున్నాను.

(మర్ల సూర్యనారాయణ మూర్తి)

# మున్నుడి

జటావల్లభుల వారి వంశంలో జన్మించడం వల్ల సహజంగానే నాకు ఛందోబద్ధమయిన రచనపై మక్కువ ఎక్కువ. ఇటీవలి కాలంలో "పద్యానికి కాలం చెల్లి పోయింది", అంటూ వస్తున్న విమర్శలకి కాలం చెల్లి పోయేలా ఈమధ్య అనేక కార్యక్రమాలు చేపట్టడం జరుగుతోంది. పద్య రచన అజరామరం. పద్య రచనలోని సొబగులు ఆశ్వాదించిన కొద్దీ ఇనుమడించి పద్యాలవైపే మనసు మళ్ళేలాగ చేస్తాయి.

కంద పద్యాలలో కూర్చిన ఈ శతకము నేను ఒకసారిగా కూర్చుని వ్రాసినది కాదు. ఆయా సందర్భాలలో మనసు స్పందించి వ్రాసినవి. కొన్ని ఆశువుగా చెప్పినవి. ఉ॥కి "కోడలె అత్తను మొత్తును" అన్న పద్యం నేను పాట్నాలో ఉండగా వార్తా పత్రికలలో వచ్చిన వార్తకు స్పందించి వ్రాసినది. మధ్యప్రదేశ్‌లోని ఒక గ్రామములో కోడలు అత్తను రోకలిబండతో బాదింది అన్నదే ఆ వార్త. ఇదే విధంగా సుమతీ శతకము వంటి శతకాలు చదివినపుడు ఆ నీతులు ఈకాలంలో వర్తించవు అనే భావం కలిగి 'మారిన నీతులు' వ్రాయడం జరిగింది. కార్గిల్ యుద్ధం జరగేటప్పుడు సరిహద్దులలో వీరోచితంగా పోరాడుతున్న యోధులకి అంకితంగా 'తస్మాత్ జాగ్రత్త' వ్రాసాను.

దీనిలో 'మహిషాసురమర్దిని' అనే శీర్షికతో రచించిన పద్యాలు 'దైవమ్' మాసపత్రికలో ప్రచురిత మయ్యాయి.

నా యందలి వాత్సల్యంతో తమ అమూల్యమైన కాలాన్ని కొంత నా కొరకై వెచ్చించి 'ఆశీస్సులు' పేరుతో అక్షరరూపంగా తమ ఆశీస్సుల నందజేసిన జ్ఞానపీఠాధిష్ఠాత, పద్మ భూషణ్, ఆచార్య సి.నారాయణరెడ్డి గారికి గౌరవాంజలి

నిరంతర కార్యభార తత్పరులయినప్పటికి నేను అడిగినదే తడవుగా శిష్యవాత్సల్యంతో తన అమూల్యమైన ఆశీస్సులు అందజేస్తూ 'కందాల కంఠమాల' పేరుతో అభినందన వ్రాసి ఇచ్చిన గురువర్యులు ఆచార్య ఎల్లూరి శివారెడ్డి గారికి వినయ పూర్వక నమస్సుమాంజలి... వాత్సల్యంతో ఈ పద్యాలను పరికించి శభాషని వెన్ను తట్టి ప్రోత్సహించిన భాషాప్రవీణ, సాహితీరత్నాకర, బ్రహ్మశ్రీ జటావల్లభుల జగన్నాథం అన్నగారికి ఆత్మీయాంజలి.

ముందు నుంచి నా రచనా వ్యాసంగానికి సారథియై నిలచి ముందుకు నడిపిస్తున్న శ్రీవారికి అనురాగరంజిత హస్తాలతో ఈ శతకమును అర్పిస్తున్నాను.

ముఖచిత్రాన్ని, ఇందులోని కొన్ని చిత్రాలను చిత్రించి ఇవ్వడమేకాక, ఈ పుస్తక ముద్రణకి ఎన్నో విధాలుగా సహకరించి చేదోడు వాదోడుగా నిలచిన చిరంజీవి 'బ్నిం' కు, బొమ్మలు గీసిన చి॥ శ్రీధర్‌కు వాత్సల్య పూర్వక శుభాభినందనలు. Proof దిద్దడంలో సహకరించిన సోదరీమణులు శ్రీమతి లక్ష్మి, శ్రీమతి సావిత్రి గారలకు కృతజ్ఞతాభివందనములు.

ఈ శతకాన్ని కంపోజ్ చేసిన M/s వెంకటేశ్వర గ్రాఫిక్స్ వారికి, సర్వాంగ సుందరంగా ముద్రించి ఇచ్చిన M/s విప్ల కంప్యూటర్ సర్వీసెస్ వారికి ధన్యవాదములు.

డా॥ సుబ్బలక్ష్మి మర్ల

# కదంబ కంద మాలిక

(కంద శతకము)

1. నాంది
2. గణేశ స్తుతి
3. శేషశైలపతి
4. రత్నగిరి
5. సప్తాశ్వుడు
6. మహిషాసురమర్దిని
7. భువనవిజయము
8. తస్మాత్ జాగ్రత
9. మారిన నీతులు
10. నీతుల రీతులు
11. ధనము
12. కుజనుడు
13. పురుషుడు
14. అతివ
15. దాంపత్యము
16. వరకట్నము
17. జననీ జనకులు
18. సత్పుత్రుడు
19. గృహనిర్మాణము
20. మంగళఫలశ్రుతి

ఓం శ్రీ అవిఘ్నమస్తు

# కదంబ కంద మాలిక

## 1. నాంది

అందముగన్ రచియించెద
కందములను లోకరీతి కట్టెదుటన్పొ
ల్పొందగ పద్యంబుల మీ
రందరకును మేలు మేలు యనుచున్ వినగన్

అంకిత మిచ్చెద దీనిని
పొంకముగన్ నాదు పతికి పొంగెడు మదితో
పంకజ మిత్రుండాతడు
సంకటములు దీర్చినన్ను సంరక్షించున్

గౌరికి మేనున బుట్టిన
గౌరీ పుత్రుడవు నీవు గణపతి బప్పా !
కోరితి నాయీ శతకము
తీరుగ వెలయింపనీదు దీవెనలప్పా!

ముందుగమ్రొక్కెద తిరుమల
మందిరమున వెలసినట్టి మహనీయునకున్
అందినదైవం బాతడు
కందములరచింపజేసె కమనీయముగన్



# 2. గణేశస్తుతి

అంకమునజేర్చి పార్వతి
పొంకముగన్ నీదుమోవి ముద్దాడంగన్
బింకమును మాని వేగమె
శంకింతయులేకగావు శంకర తనయా !

ఇద్దరు తల్లుల యొడిలో
ముద్దుగ పెరిగితివి నీవు మోక్షప్రదుడా !
వద్దకు చేరిన మమ్ముల
నొద్దికగన్గావు మయ్య ఓ ! గణనాథా !

పర్వములన్నిటికి మొదటి
పర్వము నీదై వెలయగ పన్నుగనాడా
పార్వతి మేనున బుట్టిన
సర్వాంతర్యామి వీవు సామజవదనా !

## వాగీశ్వరి

కచ్ఛపి నాలాపించుచు
నిచ్చలు నజు బాయకగడు నేర్పరితనమున్
ముచ్చటలాశ్రెడు శారద
ఇచ్చెను సకలార్థసిద్ధిని క్కోమలికిన్





## 3. శేషశైలపతి

వేంకట పతివై కలిలో
సంకటములు తీర్చువేడ్క సహ్యాద్రిపయిన్
పొంకముగన్ వెలసిన ఓ !
పంకేరుహనయన మమ్ము పాలింపుమయా !

ఇద్దరు సతులను గూడియు
నొద్దికగన్ కొండపైన నుంటివి వేడ్కన్
హద్దులు మీరిన భక్తిని
తద్దయు నినుగొలుతు నన్ను దరిజేర్పవయా !

కలవని నమ్మిన వారికి
సలలితముగ వారి కెల్ల సద్గతు లొసగన్
కలిలో వేంకటపతివై
కలుషాత్ముల పీచమడచి కాతువుజనులన్

ఇహపర సౌఖ్యము కొఱకై
తహతహ లాడుచును జనులు తపియింపంగన్
మహితాత్ముడవయి నిరతము
మహిమంబులుజూపి మోక్ష మార్గంబిడవా !?

ఎరుగని వారల కెల్లను
యెరుకను కలిగించువేడ్కనెన్నోలీలల్
యెరిగియె చేయుచు పెండ్లికి
నెరుకత వేషము ధరించి ఏగితివయ్యా

పద్మావతి పెండ్లాడగ
పద్మాయత నేత్ర నీవు పలువిధములుగన్
పద్మ వ్యూహము లెన్నో
పద్మాకర చేసినావు పాలనసేయన్

ఆకాశరాజు నీపా
దాక్రాంతుండై పదములు తాకడిగటు పై
శ్రీ కాంతను నీకొసగగ
మాకాహ్లాదమని పొంగెమదిలో భక్తుల్



## 4. రత్నగిరి

అన్నవరక్షేత్రములో
అన్నా! వెలిసితివి నీవు యార్తుల గావన్
ఎన్నో మ్రొక్కుల నిడెదము
పన్నగమము గావుమయ్య పన్నగశయనా !

సత్యవతీ సహితుడవై
సత్యముగన్ ప్రజల గావ సంరంభముతో
నిత్యము పూజలు గొనుచును
భృత్యుల గాచెదవు నీవు భృగుజామాతా !

రత్నగిరి సానువులలో
రత్నాంచితమందిరమున రమణిని గూడీ
యత్నమున చేరు వారికి
యత్నము సిద్ధింపజేతు వన్న వరేశా !



# 5. సప్తాశ్వుడు

సూర్యుడె దైవము జనులకు
సూర్యుడె యీ జగతికెల్ల సోష్మితుడెలమిన్
సూర్యుడె యాయువు ధనమును
సూర్యుడెగా పతియుగతియు సొంపుగ భువికిన్

నీవే త్రిజగత్కర్తవు
నీవే గా సకలలోక నేత్రం బెలమిన్
నీవే భర్తవు కర్తవు
నీవే జీవము జగతికి నిఖిలాధారా !

ద్వాదశరాశుల లోపల
మోదముతో సంచరించు మూర్తివి నీవే
నీ దయ కొర్కై వేచితి
నాదరమును జూపుమయ్యయంబుజ మిత్రా !

నిరతము కొలువగ పద్మిని
యరమర యొకయింత లేక నామెకుప్రేమన్
సురుచిరమగుకైవల్యము
సరగున నీవొసగినావు సవితా ! మిత్రా !

ఛాయాపద్మిని యిరుగడ
బాయకనిను గొలుచుచుండ పవలును రేయిన్
మాయా జగతిని గావగ
శ్రేయంబును గూర్తువయ్య శ్రీ తేజస్వీ !

మ్రొక్కుచు పాదాబ్జములకు
చక్కగ కీర్తింతు నిన్ను సతతము భక్తిన్
మక్కువ జూపుచు నెంతో
గ్రక్కున మము గావుమయ్య కమలా ప్రియుడా !

ఖేదములను బాపుమనుచు
పాదములను బట్టి మేము పలుమరు వేడన్
నీ దయ జూపుచు మా పై
సాదరమున గాతువయ్య సారసనేత్రా !



# 6. మహిషాసుర మర్దిని

మహిషాసురు మదమడచియు
నిహపరలోకములగాచి యింపెసగంగన్
మహిలో బెజవాడనగరి
మహిమంబులు జూపగోరి మసలితివంబా !

శంకరుని ప్రియసతివై
కింకరులను గావ నింద్రకీలాద్రిపయిన్
పొంకముగన్ వెలసిన యో !
పంకజదళనేత్రి నీవు పార్వతి వంబా !

దుర్గుని దంభమడంచిన
దుర్గామము గావుమమ్మ దురితములుడుగన్
దుర్గతి బాపుచు మాకును
దుర్గమ భవసాగరంబు తొలగించంబా !

శుంభ నిశుంభుల గూల్చియు
దంభమడచి కైటభ మధుదైత్యుల కెల్లన్
కుంభిని జనులను గాచిన
శంభుని వరరాణి నీకు శరణమె యంబా !

ధర కాకినాడపురమున
పురశాసనుని సరస త్రిపుర సుందరివై
వరముల నొసగెడి నెపమున
వరదాయిని వయితి వీవు వసుధను నంబా !

ఎన్నో అవతారంబుల
పన్నుగ నారాక్షసులను పట్టివధింపన్
సన్నుతి చేయుచు నెంతో
మన్నన జేయుదుము నిన్ను మముగావగదే!

అష్టాదశ పీఠంబుల
నిష్ఠాపరులై గొలిచెడి నీ భక్తులకున్
నష్టైశ్వర్య సుఖంబుల
నిష్టంబుగ నిత్తువమ్మ ఈశ్వర పత్నీ !

కనకా చలమున వెలసిన
కనకాంగివి నీవు మల్లికార్జున పత్నీ !
కనకపు మదితో భక్తుల
కనవరతము శుభము లొసగి యాశీస్సిడవే !

తొలినే జేసిన పుణ్యము
కలికీ యారీతి నాదు కవితగ విరిసెన్
పులకించుచు నీ కవితను
సలలితముగ నీదు పాద సరసిజములపై

శ్రద్ధాభక్తుల పేర్మిని
శుద్ధంబగు మనసుతోడ సుందరి నీకున్
తద్దయునొసగెద గైకొని
యొద్దికగన్ నాకు వరము లొసగవె యంబా!



# 7. భువన విజయము

**శ్రీ కృష్ణదేవరాయలు :**

సంగీత సాహితీసమ
రాంగణముల చక్రవర్తి రాయలని బుధుల్
సంగతిగను కీర్తించగ
బంగరుయుగమునకు నీవు పాదునుగూర్చీ!

భువన విజయ సభనమరగ
భువిలో వెలియించి లోక పూజ్యుడు కాగన్
కవులందరు దిగ్గజములు
కవనముల సభాంగణమున కాంతులు జిమ్మెన్!

**అల్లసాని పెద్దన :**

మను సంభవ కావ్యంబున్
ఘనముగ రచియించి యాంధ్రకవి తేందిరకున్
ఘనుడా పెద్దన తాతయి
ఘనముగ రాయవిభుగండు కడియుము పొందెన్

పొందెను బిరుదును పెద్దన
అందముగన్ రచనజేసి యల్లిక జిగితో
అందలమెత్తెను రాయలు
పొందుగ తన మామయనుచు పొంగెడి మదితో

**ముక్కు తిమ్మన :**

ఇంతికి అరణము వచ్చియు
నెంతయొ విభవమున దిగ్గ జేంద్రుండగుచున్
నంతః పురమున రేగిన
రంతును దీర్చంగ కావ్యరాజము గూర్చెన్

**తెనాలి రామలింగడు :**

రాయల కొలువున కవియై
బాయక చాటువులు చెప్పి బహుయుక్తులతో
రాయల మనమును దోచి
శ్రేయమునందె వికటకవి శేఖరుడనుచున్

రంగడె దైవంబనుచును
రంగుగ వర్ణించపొందు రంగని మహిమల్
లింగడ నిను కీర్తించుచు
సంగతిగను రాయలొసగె సౌఖ్యములెన్నో

**ధూర్జటి :**

ధూర్జటి నామాఖ్యుడవై
ధూర్జటి మహిమలను పొగడి దురితములుడుగన్
ఆర్జిత యశుడయినకతన
ధూర్జటి నీఖ్యాతి హెచ్చెదొనరగ జగతిన్

శ్రీకాళహస్తిశతకము
నే కామిత ఫలము గోరి యిలజేసితివో
యాకామిత మెల్లరకును
సాకారము జేసె శివుడు సాయుజ్యమిడీ

**పింగళి సూరన :**
అరుదుగ వాణీబ్రహ్మల
సురుచిర కేళీ విలాససోయగ మెల్లన్
సరస కళాపూర్ణోదయ
చరితము పింగళి రచించె సత్కావ్యముగన్

రాఘవ పాండవ గాథన
మోఘముగ ద్వ్యర్థి కావ్యముగమలచాపై
నా ఘనుడు ప్రద్యుమ్నున
మోఘ చరితమును లిఖించిమురిపించె ధరన్

గలపండిత ప్రముఖులను
తెలుగున పితృవంశచరిత్ర దెలిపెడి గ్రంథం
బు లలిత గారుడ మాదిగ
పలు రచనలు జేసి కీర్తిబడసెనతడిలన్

**భట్టుమూర్తి (రామరాజ భూషణుడు)**

రసరాజము శృంగారము
రసమయి చిప్పిల్లగ వసురాజు చరితమున్
రసవత్తరముగ వ్రాసిన
రసభూషణ రామరాజ రమ్యకవీశా!

వసుమతి చరితము నిలలో
వసుధేశులు మెచ్చు రీతి వాకృచ్చుటచే
మెసవితివి రాయల కృపను
వసుసంపదనెలమి నీవు వాక్పతి లీలన్

**అయ్యలరాజు రామభద్రుడు :**

రామాభ్యుదయము నిలలో
సామాన్యుల కందురీతి చక్కగ జేయన్
ప్రేమాస్పదుడయ్యెనతడు
రామానుజుడయిన కృష్ణరాయని కెపుడున్

**మాదయగారి మల్లన :**

మల్లయ యనువాడొక్కడు
తెల్లముగన్ కావ్యరచన తెలుగునజేయన్
ఉల్లము రంజిల రాయలు
ఘల్లున కురిపించె రత్న కాంచన రాశుల్

## 8. తస్మాత్ జాగ్రత

పొరుగున పొంచెను శత్రువు
నరరూపము దాల్చినట్టి నక్కై కుటన్
నరమేధము జేయదలచి
ధరగల రాజ్యములనెల్ల ధర్మంబడుగున్

మగనిని కొట్టిన పిమ్మట
మొగసాలకునెక్కు భంగి మోసపుబుద్ధిన్
వగచుచు నన్యాయంబని
మొగమాటములేక తాను మొరుగును కుక్కై

ఏకై పక్కన చేరగ
మా కై ప్రాణములనిచ్చు మాన్యుండని పా
రాకై దరి చేర్చంగన్
మే కై తలనొప్పితెచ్చె మిత్రుల కెల్లన్

ఎరుగడు భారత వీరుల
కరముల సత్తువ గురించి కార్పణ్యుండై
అరివీర భయంకరులై
హరియింతురు వారి నెల్ల నర నిముషమునన్

శస్త్రాస్త్ర సంచయముతో
శాస్త్రీయ విధానములను శాస్తిని చేయన్
అస్త్రములను సంధించి శి
ర స్త్రాణములను ధరించి రణమున నిలువన్

ఒక్కొక్క రొక శతఘ్ని
తెక్కలులను దునుమువేళ తెలియును శౌర్యం
బొక్కడు నిలువగ లేకను
నక్కలవలె వెన్నుజూపు నక్కుచు వారల్

అంతిమ విజయము మనదే
సుంతయు సందియము లేదు చూచును యావత్
అంతర్జాతీయ జగత
నంతోత్సుకతన్ జయజయనాదము లిడుచున్



# 9. మారిన నీతులు

సలలితముగ నీతులుమును
పలికిరిగ ప్రాజ్ఞవరులు పలువిధములుగన్
కలియుగమందున నీతులు
తెలియగ నవి తారుమారు తెలిపెద వినుడీ !

అల్లుని మంచితనంబది
కల్లయటంచు పలికెనొకకవివరుడెలమిన్
కల్లయె కాదది యీనా
డల్లురు అత్తింటివారి కాపులు కారే !?

అపకారికి నుపకారము
నెపమెన్నగజేయుట యది నేర్పరితనమా?
ఉపకారముజేసినమరి
యపకారంబెదురగుటయె యది నైజమిలన్

నోరది మంచిది యైనను
నూరును మంచిదె యనుచును నొకకవి నుడివెన్
నోరెంత మంచిదయినను
నూరక కలహించు చుందు రుర్విని కుజనుల్

చెంపను చూపుమటంచును
నింపుగ తాపలికె గాంధి యిదివరకెపుడో
చెంపను చూపిన యీనా
డంపక మగుయమపురమున కదితథ్యముగన్.

ఇల పై చేసిన పాపము
నిలపైనే యనుభవింతురిది నిజమనుచున్
పలికిన పలుకులు కల్లయె
కలిలో పాపమునపదవి కాంతురు నేతల్

ఈ గతి లాలను వాడొక
డాగడములు జేయుచు నతడన్యాయముగన్
సాగిలపడు వారికెమరి
పాగాలను జుట్టి వేడ్క పదవుల నిచ్చున్

ధరలోనొక మహితాత్ముడు
ధర హెచ్చుట తగ్గుకొరకె తథ్యంబనినన్
ధరనది చెల్లుట కల్లయె
నరయగ నిది కలియుగంబె అమ్మక చెల్లా !

కోడలి నత్తలు కొట్టుట
వాడుక యానాడు నేడు వాఙ్మాత్రంబై
కోడలె యత్తనుమొత్తును
చూడగ నీ జగతిలోన చోద్యము కాదే !?

శ్రామిక జీవుల కవియే
కామితమని తలచి రాసె కవితలు శ్రీశ్రీ
శ్రామికులీనాడెందరు
కామన సేయుదురు వాని కవితల గూర్చిన్ !?



## 10. నీతుల రీతులు

తల్లియె గురువగు బిడ్డకు
తల్లియె యీ లోకమందు దైవము కనగన్
తల్లియె సర్వము జనులకు
తల్లిని సేవింపవేరు దైవము లేలా ?!

పిల్లల దండించుటయది
తెల్లముగన్ కానిపనియె తెలియరుపెద్దల్
కొల్లలుగ నీతులెన్నో
వల్లింపగజేయవలెను వాత్సల్యముతో

మదమును మత్సరమును దన
మదిని జయింపంగలేని మనుజుండెలమిన్
పదపడిపూజలు చేసిన
ముదమున నీ జగతిలోన ముక్తుండగునే !?

నిలుచును చుట్టరి కంబులు
బలుచిత్రములై నరయగ బరతన భావం
బులు మరి యనువుగ కార్యం
బులు తీర్చుకొరకె కలిగెను ముందుగ జగతిన్

పెట్టిన వాడే దైవము
పెట్టని వాడధముడనుచు పేర్కొనుకుజనుల్
పెట్టిన తిప్పలు తప్పవు
పెట్టియు సంతృప్తి పరచ పృథ్విని తరమా ?!

పనితీరిసి వెనుక వాడె పరుడై చెలగున్
పనిపడి ధాత్రిన్ జనులీ
పని కొరకే పెక్కు పాట్లు పడుదురు సుమ్మీ!

తల్లియు దండ్రియు నిలలో
నిల్లాలికి దీటగుదురె యాకలి యందున్
బెల్లము తానగు పెళ్ళము
అల్లముగ న్మారునయ్యొ అమ్మా నాన్నల్

అన్నయు వదినయు నిలలో
నున్నతముగ దల్లిదండ్రి యూహింపంగన్
మన్నన వారల కొసగిన
సన్నతి సమకూరుసకల సౌభాగ్యంబుల్

మంచికి పోయిన చెడుయగు
నంచితముగ జగతిలోన నదితథ్యముగన్
వంచన చేయుట తగదని
యెంచరుగా మానవులిల యీయుగమందున్

మనమున దుఃఖము కలిగిన
కనుపించును జగముదుఃఖ కాసారముగన్
మనసదిపొంగెడి వేళల
తనకది నాకముగ తోచు తలగక మదిలో



# 11. ధనము

తన బిడ్డల సుఖమునకై
ధనమెంతో కూర్చగనది ధరలో బామై
తనయుల సఖ్యత చెరచును
వినగను నీ జగతి ధనము విషమే కాదా !?

ధనమది కూర్చగ నిలలో
తనవారికి సుఖమనుచును తలచుచుమదిలో
ధనమెంతో కూర్చగనది
తనవారికి కలత గూర్చి తంటా తెచ్చున్

ధనమును సృజించి మానవు
డనవరతము దాని కొరకె యర్రులు జాచన్
తనకే తెలియని యూబిని
పనిగట్టుకు పడుచుదాని బానిసయయ్యెన్



# 12. కుజనుడు

కారణమేమియు లేకనె
నూరక వేధింత్రుజగతి నుత్తమ జనులన్
నేరము చేయుట నైజము
నేరని మానవుల కిలను నీచత్వమునన్

సుజనుండితరులకొఱకై
నిజసౌఖ్యము విడచితాను నిరతము కుందన్
కుజనుడు తన సౌఖ్యముకై
సుజనులమది గాసి బెట్టి సుఖియించు నిలన్

ఎంతటి పండితునైనను
సుంతయు దోషంబులేని సుజనునినైనన్
కొంతయు మెచ్చక కుజనులు
వంతల పాల్జేయు వారి బాపపుబుద్ధిన్

నవమాసంబులు మోసియు
జవమంతయు వారి కొరకె శమనముజేయన్
అవనిని కుజనులు తల్లుల
నవమానించగను వెరువరల్పత్వమునన్

తనకాపద కలిగినచో
తన వారందరును గూడి తప్పింపవలెన్
తన వారి కష్టములలో
తనకేమియు పట్టనట్లు తప్పించుకొనున్

తమ్ముని కొఱకై త్యాగము
నిమ్ముగ తాజేసియన్న యింపొందంగన్
తమ్ముడు కృతఘ్నుడైతా
నమ్మరా ! దూషించునతని నల్పత్వమునన్

అపకారియైన వానికి
నుపకారముజేయబూను నుత్తముడిలలో
నుపకారముచేసినచో
నపకారంబగును జగతినది తథ్యముగన్



# 13. పురుషుడు

పుట్టిన దాదిగ పురుషుడు
గట్టిగనొక కాంతకేలుగైకొని పెరిగీ
దిట్టము గన్నె దిగినపరి
మట్టించుచునామె మదిని మలినము జేయున్

ఉన్నత శిఖరము చేరగ
చెన్నుగనొక కాంతకేలు చేకొని సాగున్
తిన్నగ చేరిన వెనుకను
తన్నునుగదకాంత తనకు తగదని తోచన్

కోరిక కలిగిన వేళల
కూరిమితో చెంత జేరి కోరినవిచ్చున్
కోరిక తీరిన పిమ్మట
కోరిన యాసతియె తనకు కొరగాని దగున్

గృహమును నడుపుట కొఱకై
ఇహసౌఖ్యము విడచి భార్య యిడుములబడగన్
గృహపతి తెలియక దానిని
అహమెంత యొజూపి యామె నవమానించున్

పతియేదైవంబనుచును
సతతము తాతలచి భార్యసంసేవింపన్
పతితా నలసత తోడన్
సతినెంతోనొవ్వజేయు సరసత లేమిన్

## 14. అతివ

అత్తనె యమ్మగదలచుచు
మెత్తని తమ మనసుతోడ మిత్రుల బోలెన్
చిత్తమును దోచి నేర్పుగ
నత్తను మెప్పింత్రుకొందరతివలు ధాత్రిన్

పతియేదైవంబనుచును
సతియెంతో కూర్మితోడ సంసేవించున్
సతిసౌమ్యత లోకువగన్
పతి యెంచుచు నామెనంత పరిభావించున్

మనువాడిన వారెతనదు
మనసెరుగక దుఃఖపెట్టమరిగతి యేదీ!?
మనసదికలగిన దుఃఖమె
మనుగడ యే భారమగును మరిమరి తలచన్

పితరులు అత్తయు మామయు
వితరణ శీలంబె మేటి విత్తము సతికిన్
పతిపదసేవయె భాగ్యం
బతులితముగ ధరణిలోన నతివలకెల్లన్

వినవలయును సతియెప్పుడు
వినయముతో భర్త మాట విధితనకనుచున్
వినడాపతియామె పలుకు
తనమగటిమ చేటని మరి తలచుచు మదిలో

# 15. దాంపత్యము

ధరగల బంధుత్వంబులు
నరయగనవికల్లలన్ని యంతమువరకున్
నరమరలులేక సాగెడి
సురుచిరమగుబంధమొకటి సుదతికి పతికిన్

కోరిన పురషుడు పతియై
కూరిమితో తనకు పొందు గూర్చుచునెపుడున్
కోరిన రీతగ నేలుట
యారయ నీజగతిలోన నదిపుణ్యం బౌ

మన సెరిగి మసలు కొనుచును
ననవరతము కూర్మితోడ నాత్మేశ్వరియై
తననెప్పుడు కొలిచెడి సతి
పొనరుట యీ జగతి నరుని పుణ్యము కాదే !?

పొందుగ విరిసిన యందము
నందముగన్ నొసగునామె యాత్మేశునకున్
డెందము పొంగగ నాతడు
కందర్పుని కేళిలోన కాంతను దేల్చున్

సతియందుప్రేమముచే
పతియెంతో కూర్మితోడ పలు విధములుగన్
సతతము నామెకు హృదయము
నతిహర్షము చెందు రీతినలరించు నిలన్

# 16. వరకట్నము

వరకట్నము గొనుటన్నను
నిరతంబదినేర మనుచు నెమ్మది తోచన్
వరుతలిదండ్రులు వారలు
గరితంబగు మనసుతోడ కట్నము విడువన్

అది లోకువగన్ చేకొని
మదిలో నిది నేరమనుచు మరియెంచకనే
హృదయము నొవ్వగ జేయును
సుదతీమణి తల్లి దండ్రి శుష్కప్రియులై

వలదని కట్నము చెప్పుట
వెలదిరొమన నేరమనుచు వెతజెందిమదిన్
పలు విధముల బాధలుపడి
విలపింతురు పరువు తీయవీయపువారల్

తనయుని పెండ్లికి తరలగ
ఘనమౌమర్యాదలెన్నొ కలుగునటంచున్
మనమున తలచుచునుండుట
కనుగొనగన్ వెఱ్ఱితనము కాంతలకెల్లన్

నెయ్యమున మెలగ వలెనని
వియ్యపు వారలకు మిగుల వినయమ్ము జూపన్
వెయ్యారు విధమ్ములుగా
కయ్యమునకు కాలుదువ్వి కలహింతురిలన్

ధనమెంతో వ్యయ పరచుకు
పనులన్నియు నిర్వహించ పలు విధములుగన్
కనుగానక వధుపక్షం
బనవరతము నింద మోపు నల్పపుబుద్ధిన్

# 17. జననీ జనకులు

కొడుకునకు పెండ్లిసేయగ
కొడుకును గోడలును మిగుల కూరిమితోడన్
కడు నెయ్యము గూర్చి తమను
దడయక సేవింతురనుచు తలతురు పితరుల్

తలచిన వారల తలపును
మలి నిముషమె తుంచి వేసి మలినాత్ముండై
చెలియకు మోదము గూర్చగ
పలవింపగ జేయు వారి ప్రాజ్ఞత లేమిన్

మనసది యెంతగ నొచ్చిన
మనగడయే తుదకు తమకు మధనంబైనన్
మనసున ద్వేషంబుంచక
తనయుల దీవింత్రు తల్లిదండ్రులు ప్రీతిన్

కొడుకులు కావలెననుచును
కడువిధముల పూజలెన్నొ కాంక్షను సలుపన్
కొడుకులు కలిగియువారలు
కడునొవ్వగజేతురుగద కాంతకు వశులై

సంతతి కావలెననుచును
సంతతమును చింతనొందు సజ్జనులెపుడున్
సుంతయు నూహింపరుమరి
సంతతి యే తమకు మిగుల శత్రువులగుటన్

కోడలె కూతురు తమకని
గాఢమగు ప్రేమతోడ గారము చేయన్
కోడలు కొరవిగ మారిన
కూడుండుట సాధ్యమగునె కూరిమి తోడన్

పిల్లల యున్నతి కొరకై
తల్లియె తాజేయునెన్నొ త్యాగము లెలమిన్
పిల్లలు తెలియక దానిని
తల్లిని తాదలచుచుంద్రు తక్కువదనుచున్



# 18. సత్పుత్రుడు

జననీ జనకుల నిలలో
తనపాలిటి దైవములని తలచుచు పేర్మిన్
వినయమున సేవజేయుచు
తనియింపగజేయువాడె తనయుండెలమిన్

తనయులు వృద్ధాప్యములో
కనుపాపల వలెను తమను కాచుచునుండన్
జననీ జనకుల జన్మము
కనుగొన ధన్యంబు గాదె కనుటచె వారిన్

కువలయ మందున తల్లిని
దివిజ సమానగ కొలుచుచు దీవెనలందీ
భవతరణమామెసేవని
జవదాటడు జననిమాట సత్పుత్రుడిలన్



# 19. గృహనిర్మాణము

అందముగన్ నిర్మించెద
సుందరమగు గృహము నేను సుజనులు మెచ్చన్
ఇందేమి ఘనత కలదని
పొందుగ తాదలచుటదియె పొరపాటు సుమీ !

పగవారే పనివారయి
మొగమాటము లేక మదిని మోసంబనకన్
తెగనీల్గి పనులు చేయక
వగపింతురు పలువిధాల వంచనపరులై

ధనమెంతో వ్యయ పరచుకు
పనివారల కూడగట్టి పరుగులు పెట్టన్
పనియది జరుగదు వేగమె
కనుగొన యజ్ఞంబుగాదె కట్టడమన్నన్

వచ్చెను తాపీవాడని
ముచ్చటగన్ హంగులన్ని ముందుగ గూర్చన్
మచ్చునకు కానరాడుగ
ముచ్చరి వడ్రంగివాడు మోసపు బుద్ధిన్

ఆధునిక పద్ధతులలో
మేధావులు మెచ్చు రీతి మేడన్కట్టన్
సాధకులను నియమింపగ
వేధింతురు చేతకాక వెంగలు లగుచున్

ఇక్కట్లు యెన్ని పడినను
మిక్కుటముగ సంతసింత్రు మేడను గాంచన్
పెక్కండ్రుహితులు బంధులు
గ్రక్కున వారెల్లబొగడ గరిమంబెసనగ్





# 20. మంగళఫలశ్రుతి

మంగళమిదె వేంకటపతి
మంగళ చరణములకు శుభమంగళ మలమే
ల్మంగకు సురుచిర రూపకు
మంగళ మాసిరి నెలవుకు మంగళ మెలమిన్

మంగళకారుడు గణపతి
కంగజ హర్తకు సతికిని హారతు లిడగన్
సంగతిగ శతక కర్తకు
మంగళ మొనరింపు మమ్మ మాయిలవేల్పా !

సుద్దులు చదివినవారికి
పద్ధతిగన్ ప్రతిని కొన్న పౌరులకెల్లన్
శ్రద్ధగ విను వారలకును
బుద్ధులు తానిచ్చువాణి పులికించి మదిన్



